Regd No. N. 40 / M. 3813

వెల ఒక అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ర ఫాల్గుణ శు॥ ౮ (౨-౬-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౨౪

జపానుకు ఫ్రెంచివారి సమాధానము

గ్రీసులో గొప్ప భూకంపము

# బల్గేరియా జర్మనీకూటంలో చేరుట

## బల్గేరియా అంతటను జర్మనుసేనల విమానాలు

### యుగోస్లావియాకు బెదిరింపులు

ఏమగుతుందో ఏమగుతుందో అని చూస్తూవుండగా బల్గేరియా రాజ్యంతుదకు జర్మనీకూటంలో చేరనే చేరినది. బ్రిటిషువారి హెచ్చరికలవల్ల ప్రయోజనంలేకపోయినది. ఇపుడు యుగోస్లావియాకు బెదరింపులు చేయబడుచున్నవి.

మార్చి ౧వ తేది మధ్యాహ్నం ౧౨ గంటలకు జర్మనీకి సామంతరాజ్యంగా ఉన్న ఆస్ట్రియాయొక్క ప్రధాననగరము వియన్నాలో బల్గేరియా ప్రధానమంత్రియగు ప్రొఫెసరు ఫిలోఫ్ గారును, జర్మనీపక్షమున జర్మనువిదేశాంగమంత్రియగు హెర్వాన్ రిబ్బన్ ట్రాఫ్ గారును, ఇటలీపక్షమున ఇటలీవిదేశాంగమంత్రియగు కౌంటు సియానో గారును, జపానుపక్షమున జర్మనీలోని జపానురాయబారియగు జనరల్ ఓషిమా గారును ఇదివరలో జర్మనీ, ఇటలీ, జపానులు కుదుర్చుకొనియుండిన ఒడంబడికకు అంగీకరించినట్లు సంతకములను చేసిరి, ఆసందర్భమున బల్గేరియా ప్రధాని తన అభిప్రాయమును, జర్మనుభాషలో వ్రాయబడినట్టిదానిని చదివిరి. బల్గేరియా ఈఒడంబడికను శిరసావహించువనియు, తనయిరుగుపొరుగురాజ్యములతో సఖ్యముకలిగియుండుననియు, రష్యాతో స్నేహము గలిగియుండుననియు అందు చెప్పబడినది. బల్గేరియాను అభినందించి రిబ్బన్ ట్రాఫుగారు మరికొన్ని రాజ్యాలు త్వరలోనే జర్మనీ, ఇటలీ, జపానులకూటంలో చేరగలవని చెప్పిరి

ఈఒడంబడికపై సంతకాలు కాకముందే మార్చి ౧వ తేదిఉదయమే జర్మనుసేనలు బల్గేరియాలో ప్రవేశించినవి- మధ్యాహ్నానికి బల్గేరియాలోని అనేకపట్టణాలలో జర్మనుసేనలు తిరుగుచుండినవి_జర్మనువిమానాలు అన్ని బల్గేరియాలోని విమానాశ్రయాలలో చేరినవి_ నల్లసముద్రంలో బల్గేరియాకు చెందిన వర్నా రేవును కూడ జర్మనుసేనలు ఆక్రమించినవి_ మార్చి ౪ వ తేదినాటికి జర్మనుసేనలు బల్గేరియా అంతటను వ్యాపించిపోవునని జర్మనులధికారులు ప్రకటించినారు- జర్మనుప్రభుత్వవిదేశాంగశాఖవారు మార్చి ౨వ తేదిన చేసిన ఒకప్రకటనలో బాల్కనుప్రాంతమునకు యుద్ధము వ్యాపింపజేయుటకై బ్రిటను ప్రయత్నము చేయుచున్నదికనుక బల్గేరియాను రక్షించుటకై జర్మనుసేనలిపుడే బల్గేరియాలో ప్రవేశించినవని చెప్పబడినది.మార్చి ౨ వతేదిన బల్గేరియా ప్రధాని ఫిలాఫ్ గారు సాయంకాలం బల్గేరియా శాసనసభసమావేశంలో గావించిన ప్రకటనలో బల్గేరియాలోకి జర్మనుసేనలను రానీయవలసినదని జర్మనీవారు బల్గేరియాప్రభుత్వమును కోరినట్లు తెలియజేసిరి- ఈసేనలు బాల్కనుప్రాంతంలో శాంతినిరక్షించుటకై కొద్దికాలము మాత్రముండునని జర్మనుప్రభుత్వమువారు తెలియజేసినారట_బల్గేరియాకు ఇరుగుపొరుగురాజ్యాలతో ఏటువంటిసంఘర్షణగాని వచ్చేపనులనుగాని. బల్గేరియాలో శాంతిభంగము కలిగించేపట్టిపనులనుగానిచేయుటకై బల్గేరియాప్రభుత్వమును జర్మనుప్రభుత్వమువారు కోరలేదని ఫిలాఫ్ గారు అభయమిచ్చిరి.

బల్గేరియాలోనుండి బ్రిటిషుప్రజలు అప్పుడే లేచిపోయినారు. ఇపుడు బ్రిటిషుప్రభుత్వపు రాయబారిగారును వారిఉద్యోగస్థులును మిగిలియున్నారు బ్రిటిషుప్రభుత్వపురాయబారిగారి పేరు జార్జిరెండెల్.వీరు మార్చి ౨ వ తేదిరాత్రి బ్రిటిషుపతాక మెగురుచుండేతమకారులో జర్మనుసేనల బారులప్రక్కనే పోయి బల్గేరియారాజా బోరిస్ గారినిదర్శించి సంభాషించిరి. ఏమిసంభాషించిరో సత్యముగా తెలియదుగాని అందరును అనుకొనదంఏమనగా, పరిస్థితి చాలా భయపడవలసినదిగానే ఉన్నదనిరెండెల్ గారు విశదీకరించినతర్వాత బోరిస్ రాజాగారు కడ అంగీకరించినారట బ్రిటనులో బల్గేరియారాయబారి తనబల్గేరియా ప్రభుత్వానికి తామతినఉద్యోగానికి రాజీనామా నిచ్చుచున్నాను కాబట్టి అంగీకరించవలసినదని టెలిగ్రాపుద్వారా మార్చి ౨వ తేదినాడే తెలియబరచినారట. బల్గేరియాలో జనులనునిర్బంధంగా సేనలో చేర్చుచున్నారు_ ఇప్పుడుమిగిలినందుకు ఇంతసేవలని బల్గేరియాలోని బ్రిటిషురాయబారి చాలాగట్టిగా ఆక్షేపించినాడట_ బ్రిటిషురాయబారియొక్క బట్లరును కూడ సేనలో చేర్చుకొనుటకై బల్గేరియాఅధికారులు పిలుచుకొనిపోగా బ్రిటిషురాయబారి ఆక్షేపణ పైవదలిపేసిరి. బల్గేరియాలో కొందరు పత్రికావిలేఖకులను అరెస్టుచేసినారు. వారిలో ఒక బ్రిటిషు పత్రికవిలేఖరియుండెను_ అతనినికూడ బ్రిటిషురాయబారిఆక్షేపణపైవదలెను. బల్గేరియాలోనినివాసములనుజర్మనుసైనికులకిచ్చుట, బల్గేరియాలో త్రోవ మాపుస్తంభముల కంటించియుండు పలకలపై జర్మనుభాషలో వ్రాయుట_ ఇట్టివిబల్గేరియా సహకారంలేనిది జర్మనులు చేయజాలరనియు, కావున బల్గేరియా వారు జర్మనీకి లొంగినందుకు సహాయంకావలెననియు బ్రిటిషురాయబారి కొన్నిరోజులముందుగా చేచాలా ఆక్షేపించియుండెను. ఇప్పుడు బల్గేరియానుండి బ్రిటిషురాయబారి లేచిపోవుటే మోకను సందేహము వచ్చుచున్నది. అదిమార్చి ౫వతేదినాటికి గాని నిర్ధారణగా తెలియదు.

అమెరికాలో సమ్నర్ వెల్సు గారు మార్చి ౧వ తేదినాడు పత్రికలవారలకు తెలిపినదేమనగా బల్గేరియా జర్మనులఅధికారక్రిందికి రావడము పోయినట్లుగా అమెరికాలో తలంచేదే ఆటువంటి బల్గేరియా ధనమంత తియుబయటికి పోకుండాఆటకాయించే విషయమై అమెరికాసంయుక్తరాజ్యప్రభుత్వమువారాలోచించవలసియుండురట.

తుర్కీ బల్గేరియాతో ఒడంబడికచేసుకొనగానే జర్మనీఒత్తిడికిలోకపుటలో లొంగిపోయేమోఅనిపలువురు సంశయించిరి, అయితే వెంటనే బ్రిటిషుప్రభుత్వవిదేశాంగమంత్రి ఈడనుగారు తుర్కీకి వచ్చి ప్రధానితోను, తుర్కీఅధ్యక్షునితోను సంభాషించి బ్రిటిషుప్రభుత్వాభిప్రాయముతో తుర్కీ ప్రభుత్వాభిప్రాయము ఏకీభవించుచున్నట్లు ప్రకటించిరి. ఆసంభాషణలవివరములు తెలియవుగాని ఇపుడు తుర్కీవారి డార్డనెల్సు జలసంధిలో మందుగను ఉంచేయబడినవి. ఈసంగతి అజలసంధిలో గుండాపోయే నావలకు హెచ్చరిక చేయబడినది. తుర్కీ ప్రభుత్వమువారినూతనసంవత్సరవ్యయంలో పూర్వసంవత్సరంలోకంటె ౭౦ లక్షల పౌనులు ఎక్కువచేయబడినవి- యుద్ధభయమువల్ల తుర్కీ దేశరక్షణకై ఇట్లు చేయుబడినది ఇపుడువ్యయము మొత్తము ౭౦ కోట్ల పౌనులగునని అంచనావేసుకొనబడినది.

ఈబాల్కను వ్యవహారాలవిషయంలో రష్యావారి వైఖరి ఎట్లున్నదో తెలుపుటకై రష్యాలోని బ్రిటిషురాయబారియగు సర్ స్టాఫర్డ్ క్రిప్సుగారు ఈడన్ గారికి తెలియజేయుటకై మార్చి ౧౧వ తేదీ తుర్కీలోని అంకొరాకు వచ్చిరి.

బల్గేరియాను ఇట్లుచేతిలో వేసికొని జర్మనులిపుడు యుగోస్లావియాను బెదరించుచున్నారు_ యుగోస్లావియాపై జర్మనువిమానాలు మార్చి౧వ తేదిన ఎగిరినవి- వాటిలో ఒకటి కిందకూలెను. ఇపుడు యుగోస్లావియా సరిహద్దున డాన్యూబునదిపై యుగోస్లావియా ప్రభుత్వమువారు విమానధ్వంసక శతఘ్నులను ఏర్పాటుచేయుచున్నారు_ యుగోస్లావియా ప్రధాని సెకోవిచ్ గారు మార్చి ౨వ తేదిన రాజాగారితో సంభాషించిరి_ జర్మనుల బెదరింపునుగూర్చియే సంభాషించియుండును.

### ఇండోచైనా, థాయిలాండు వివాదము

ఇండోచైనా, థాయిలాండులవివాదములో జపానుమధ్యవర్తిగా చేసినసూచనలకు ఇండోచైనాపక్షమున విషీలోని ఫ్రెంచిప్రభుత్వమువారు ఒకసమాధానము వ్రాసి జపానులోని ఫ్రెంచిరాయబారికిపంపించి, దానిని జపానుప్రభుత్వమునకు అందజేయవలసినదని కోరినారు. ఆక్షేపకారము మార్చి ౨వ తేదిఉదయము జపానులోని ఫ్రెంచిరాయబారి ఫ్రెంచివిదేశాంగమంత్రిగారికి విషీప్రభుత్వపు సమాధానమునుఅందజేసిరి. ఆసమాధానపత్రములో రాజీపడు సూచనలున్నట్లు జపానువారు ప్రకటించినారు. జపానువారిసూచనలలో కొన్నిసూచనలు స్పష్టముగాలేవనియు, ఆఅంశములనుస్పష్టముచేయవలసినదని విషీ ప్రభుత్వమువారు జపానుప్రభుత్వమువారిని కోరుచు శాంతముగా ఇండోచైనా థాయిలాండుల వివాదము పరిష్కారమగుటకు వీలుండునట్లుగా తమసమాధానమును వ్రాసిపంపించిరనియు జర్మను ఆఫీషియల్ న్యూస్ ఏజన్సీ" వారు తెలుపుచున్నారు జపానులోని ఒకపత్రికలో విషీప్రభుత్వమువారు టోకియోయందలి తమరాయబారిని జపాను ప్రభుత్వసూచనలను ప్రతిగాతుకియొక సూచనను చేయవలసినదనికోరినట్లు తెలుపబడినది. ఈఊహలనిజమెంతో ఏమోగాని, విషీ ప్రభుత్వమువారు జపానుసూచనలకు సమాధానమైతే పంపించిరమాటసత్యము_

ఫ్రెంచిఇండోచైనా ప్రభుత్వమువారి నావాదళము ఇండోచైనాలోని సెయిగాను [illegible] ముదగ్గర గా న్యారి నౌకాశ్రయములో కేంద్రీకృతమైయున్నది, కొచిన్ చైనాలో కూడ ఇండోచైనావారు సైనికసన్నాహము ప్రబలముగా చేసియున్నారు. జపానుసేనలు హైనాను ద్వీపములోను, టాన్కినులోను సంసిద్ధముగనున్నవి ఫ్రెంచి ఇండోచైనాతీరమునకు ఆనెక జపానుయుద్ధనౌకలు సంచరించుచున్నవి_

పోయినసంచికలో థాయిలాండుపూర్వపు రాజుగారు ప్రజాధిపో గారు థాయిలాండువైఖరి బ్రిటనుకుఅనుకూలమనియు, జపానుకు ప్రతికూలమనియు చెప్పినట్లు ఒకవార్త వచ్చియుండెను- ఇపుడు థాయిలాండుప్రధానమంత్రి థాయిలాండువైఖరి అన్నిదేశములతోను సమానమైత్రియేననియు, ప్రజాధిపో గారు అట్లుచెప్పియుండిరనియు ఫిబ్రవరి ౨౮వ తేదిన ప్రకటించినారు_

బర్మారక్షణచర్యలు పూర్తికావచ్చుచున్నవి- సింగపూరు రేవుసమీపమున తూర్పుసముద్రంలో మరికొన్ని మందుగను లుంచబడుచున్నవి- ఇపుడు ఆవైపునుండిసింగపూరును ఓడలు ప్రవేశించవీలులేదు_ సింగపూరునుండి జపానుపౌరులు లేచిపోవుచున్నారు_ ఇండోచైనాలోని బ్రిటిషువారుకూడ బ్రిటిషు ప్రభుత్వముయొక్క సలహాపై లేచిపోవుచున్నారు-

జపానుప్రభుత్వమువారు చైనాలోతమసేనల ప్రధానాధిపతిగ నున్నవారితో సహా ౭౦మందిగొప్పసైనికాధికారులను మార్చి వారలస్థానాలలో క్రొత్తవారలను నియోగించుచు, జపానువారిసైనికచర్యలు ఇప్పటికి అదేశ్రేష్టముగానుండుటకై ఇట్లుచేయబడినదనుచున్నారు_

మార్చి ౧వ తేదిన జపానుశాసనసభవారు అంతర్జాతీయపరిస్థితులలో క్రొత్తమార్పులువచ్చినందువల్ల సైనికశాఖకుఎక్కువగా ద్రవ్యముఅవసరమని ప్రభుత్వమువారుకోరినందువలన [illegible] కోట్ల పౌనులఖర్చుచేయుటకు అనుమతినిచ్చినారు-

ఆసియాఖండపుతూర్పుకొసన జపానుచర్యలవల్ల కలుగుచున్నస్థితినిగూర్చి మార్చి ౨ వ తేదిన ఆస్ట్రేలియాప్రధాని ఆర్.జి.మెంజీస్ గారు ఉపన్యసించుచు ఆప్రాంతంలో యుద్ధముతప్పదనేమాటగాని, అక్కడవచ్చినచిక్కు ఏదిగాని అన్నిదేశాలవారును పరస్పరము నిక్కపటంగా వర్తించుచు వ్యవహరించేటట్లైయుతే తొలగిపోదనిగాని తానునమ్ముటలేదనిరి_ ఇట్లుమనస్సులో దాచిపెట్టుకొనక ఆస్ట్రేలియా అభిప్రాయాలను జపానుకు తెల్పుచుండుటకే ఆస్ట్రేలియాప్రభుత్వమువారు జపానులో ఒకక్రొత్త రాయబారిని ఏర్పాటు చేసికొన్నారనిరి_ ఇట్లుఏర్పాటుచేయుటచే బ్రిటిషుసామ్రాజ్యంనుండి ఆస్ట్రేలియావిడిపోవుచున్నదనుటతప్పనిచెప్పిరి_ కాని వాస్తవంలో ఉన్నస్థితిని గుర్తించి ఎవరుతమదేశంమీదికి దండెత్తివచ్చినను ఎదుర్కొని ప్రతిఘటించుటకై ఆస్ట్రేలియావారు సర్వసన్నాహాలను చేసికొనియున్నారనిరి_

### అల్బేనియాలో ఇటలీ, గ్రీసుల యుద్ధము

అల్బేనియాలో మంచుపడుచుండుటవల్ల కొన్నిరోజులు సరిగా జరుగకయుండిన ఇటలీ, గ్రీసుల యుద్ధము మరల సాగుచున్నది, గ్రీకుసేనలే అన్నిరంగాలలోను ఇటలీసేనలనోడించుచు క్రొత్తప్రదేశములను పట్టుకొనుచు ముందుకుపోవుచున్నవి అట్లుపట్టుకొనబడిన ప్రదేశాలపేర్లు వార్తలలో తెలియవచ్చుటలేదు,

ఇకవిమానాలదాడులసంగతి ఫిబ్రవరి ౨౮వ తేదిన ౨౭ ఇటాలీయువిమానాలను అల్బేనియాలో బ్రిటిషువిమానదళమువారు పడగొట్టిరి, టెపిలినికి తూర్పున కొండ్రాతొస్సెగామంమీద బ్రిటిషువిమానాలు బాంబులువేసినవి, వాలోనామీదకికూడ బ్రిటిషువిమానాలు ఫిబ్రవరి ౨౮వ తేదినాడే గాక మార్చి ౧వ తేదినవుపోయి బాంబులువేసి అక్కడి ఇటాలీయ విమానాశ్రయమును ధ్వంసముచేసి ౧౨ విమానాలను నాశనంచేసినవి, మార్చి౧వ తేది గ్రీకువిమానములును బ్రిటిషువిమానాలును కలసి అల్బేనియాలోని ఇత్తర ప్రాంతములో బేరాటు, ఎల్బాసనుల ప్రాంతంపైనను, టెపిలిని మీద బాంబులు వేసినవి. బ్రిటిషువిమానాలు కూడ కదు టెపిలిని ప్రాంతపైకి మార్చి౧వ తేదినాడు వచ్చిన ౨౦ ఇటాలీయువిమానాలలోను ఎనిమిదింటిని క్రిందకూల్చివేసెను- ఇటాలీయువిమానాలు గ్రీసుమీదికి ఫిబ్రవరి ౨౮వ తేదివచ్చి ప్రెవెజామీదను, కొర్ఫుదీవిమీదను, ఫోరిన మీదను బాంబులువేసినవి- ఆఇటాలీయువిమానాలలో నాలుగింటిని గ్రీకువారలు ధ్వంసముచేయబడినవి. మార్చి ౧వ తేదినాడుకూడ ఇటాలీయువిమానాలు అల్బేనియాలోని గ్రీకుసేనల మకాములపైన బాంబులను వేసినవి,

ఇపుడు అల్బేనియాలో ఇటాలీయ, గ్రీకుసేనలమధ్య యుద్ధముకేంద్రప్రాంతమున హద్దుల్లను, ఉత్తరదక్షిణప్రాంతమందును, దక్షిణప్రాంతమందు జరుగుచున్నది

### గ్రీసులో గొప్ప భూకంపము

ఇదిఇట్లుండగా మార్చి ౧వ తేదిన గ్రీసుదేశపు ఉత్తరభాగంలో లారిస్సానగరంలో ప్రచండమైనభూకంపమువచ్చి అక్కడి ౩౪ వేలమందిజనులు నిలువనీడలేనివారైనారు_ ౧౦౦ కి ౭౦ మంది దుర్మరణముపాలైనారు_ బ్రిటిషువిమానాలు మోటారుబస్సులు గాయపడినవారలకు చికిత్సలు చేయుటలో తోడ్పడెను_ ఇట్లుభూకంపముతో ఆపదపడుచున్నవారిపై కొన్ని ఇటాలీయవిమానాలు బాంబులనువేసినవి- కుడకువిమానాలను గ్రీకులు పారద్రోలిరి-

బ్రిటిషువిదేశాంగమంత్రి ఈడెన్ గారు బ్రిటిషుప్రభుత్వపు సర్వసైన్యాధిపతియగుసర్ జాన్ డిల్ గారితో సహా తుర్కీ లోతమపనిముగించుకొని మార్చి ౨ వతేదిన గ్రీసుప్రధాననగరమగు ఏథెన్సుకువచ్చి గ్రీసుప్రధానికొరిజిస్ గారితోను గ్రీసురాజుఅగు జార్జిగారితోను సంభాషించిరి-

ఇపుడుజర్మనీవారు గ్రీసు ఇటలీలయుద్ధమును ముగించివేయుటకై ఏవో కొన్ని సంధిసూచనలు చేయనుద్దేశించియున్నట్లు చెప్పుచున్నారు_ ఇంతవరకు గ్రీసువారుఅల్బేనియాలో గెలిచినప్రదేశాని గ్రీసువారికేవుండనిచ్చుటయు, దానికిబదులుగా జర్మనీవారికియుద్ధంముగిసేవరకు గ్రీసులో కొన్నిసైనికాశ్రయములను ఇచ్చుటయు ఈసంధిషరతులుగానున్నవి_

### ఆఫ్రికాలో ఇటలీ, బ్రిటనులయుద్ధము

ఆఫ్రికాలో అన్నిరంగాలలోను బ్రిటిషుసేనలు ఇటాలీయులనోడించి వారలస్థానాలనుపట్టుకొనుచుముందుకుపోవుచునేయున్నవి, మార్చి ౧వ తేదినాటికి ఇటాలీయ సోమాలిలాండులో బ్రిటిషుసేనల ఒత్తిడివల్ల ఇటాలీయసేనలు జూబానదికిని లాడ్బిసిబాయ్ అనుచోటికిని మధ్యనుండు దేశమునుఖాళీచేసి అబిసీనియాలోని ఆడిస్ అబాబా, హరారు పట్టణములవైపుపోసాగిరి, సోమాలిలాండులో బ్రిటిషుసేనలు సఫలతసాగించినది మొదలుకొని ఇప్పటివరకు ౯ వేల ఇటాలీయ సైనికఖైదీలు, చాలఇటాలీయ యుద్ధసామగ్రి బ్రిటిషువారికిచిక్కెను బ్రిటిషువారు జూబానదికి ౨౦౦ మైళ్లఎక్కువనున్న బార్డరాను ఫిబ్రవరి ౨౬వ తారీఖున ఆక్రమించిరి. అక్కడిఇటాలీయులు అబిసీనియాలోకి పారిపోయిరి. మార్చి౧వ తేదినాటికి బ్రిటిషుసేనలు మొగిడీషుదాటి ౫౦ మైళ్లదూరానికిపోయి మాకా, డెగ్లి,అబుజిలా గ్రామాలను పట్టుకొనిరి.

అబిసీనియారంగంలో ఇటాలీయసేనలు గోజాంప్రాంతమునుఖాళీచేసినవి. ఇరిత్రియారంగంలో కెరెనుకుఉత్తరంగా ౨౦మైళ్ళ దూరంలో ఉండే ఒకకొండకనుమ బ్రిటిషువారికివశమైనది ఇదిచిక్కినందువల్ల ఇరిత్రియా యంతయు సులభంగా వశమగునట. లిబియారంగంలో బ్రిటిషువారితో చేరి పోరాడుచున్న డీగాల్ గారి ఫ్రెంచిసేనలు దక్షిణప్రాంతంలోని యెడారిలో కుఫ్రా అనులంకను మార్చి౧వ తేదినపట్టుకొనెను. ఈలంక బెంఘాజీకి ౫౦౦ మైళ్ళదూరములో నున్నది.

ఇవిఆఫ్రికాలో బ్రిటిషుసేనలుగెలిచిన స్థలాల సంగతి. ఇకమిగిలినవి విమానదాడులు. ఈదాడులచే బ్రిటిషువారు ఇటాలీయులకు గొప్పగొప్పనష్టములుకలిగించుచున్నారు- ఆదాడులవన్నిటినివరుసగాచెప్పుటకు స్థలముచాలదు, కొన్ని విచిత్రాంశములను చెప్పెదను- ఫిబ్రవరి ౨౮వ తేదిన మొగిడీషుకుఉత్తరంగా లారీలలో పారిపోవుచుండిన ఇటాలీయసేనలపై బ్రిటిషు విమానాలు బాంబులనువేయుటచే అట్టిలారీలు అనేకము ధ్వంసమయ్యెను- కెరెనుకు ఆగ్నేయముగానున్నట్టి రైలుమార్గముమీదకూడ బ్రిటిషువిమానాలు అనేకబాంబులనువేసినవి_ లిబియాలో బ్రిటిషుసైనికులచేపట్టుబడిన ఒకవిమానము జర్మనువిమానమైయున్నది- జర్మను సైనికదళమొకటి లిబియాలో దిగినట్లు ఇటాలీయపత్రికలో ఒకవార్త వ్రాయబడినది- ఇటాలీయువిమానాలు మాల్టాపై ఫిబ్రవరి ౨౬వ తేది ఉదయము బాంబులువేయుటచే ౨౦మందిఇండ్లులేకనిరాధారులైరి. మార్చి౧వ తేదినాడుకూడ మాల్టాపై ఇటాలీయవిమానాలదాడిజరిగెను,

మధ్యధరాసముద్రంలో ఇటలీకి చెందిన కాస్టిల్ అరిజో అనే లంకను బ్రిటిషువారు వశపరచుకొనినట్లు వార్త వచ్చినది,

మ. ఘ. వ. నిజాం ప్రభువుగారు రెడ్ క్రాస్ సొసైటీకి ఇచ్చిన ఆరు అంబులెన్సులు ఇపుడు ఆఫ్రికాలో జరుగుతుండేయుద్ధంలో తోడ్పడుచున్నవని తెలిసినది.

× × ×

( ౫ వ పుట చూడుడు )

# హిందువులందరికిని శస్త్రాధికారమున్నది

## బ్రాహ్మణులకునుకలదు

### శాస్త్రాలవాసనకూడ తెలియని వక్తుల వ్రాత అజ్ఞానవిలసితము

కొన్ని దినములకుపూర్వము వఖ్తుదైనిక పత్రికలో హిందూసమాజమునుగురించి చర్చచేయుచు ప్రాసంగికముగా ధర్మశాస్త్రముననుసరించి హిందువులలో బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాది అవాంతరజాతులుకల్పింపబడియున్నవి. వీటిలోక్షత్రియజాతిమాత్రమే శస్త్రమునుపట్టుటకు అర్హతకలిగియున్నది. కానితక్కినయేజాతికికూడ శస్త్రమును ధరించేఅధికారము ధర్మశాస్త్రము ననుసరించిలేదు. తురకజాతిలో దీనివిరుద్ధముగా ప్రతివాడుకూడ శస్త్రముధరించగలడు. అనగాప్రతివాడును సిపాయికాగలడు అని తెలుపబడియుండెను ఇతర విషయములచర్చ అప్రస్తుతము అనుపయుక్తము. ఈవిషయముమాత్రము ధర్మశాస్త్రమునకు సంబంధించినది. గనుక హిందూశాస్త్రము ననుసరించి చూడగా హిందువులలో పాతికమందిమాత్రమే సిపాయీలుకాగలరాయను ప్రశ్న బయలుదేరుచున్నది. దీనికిప్రత్యుత్తరమేమన ధర్మశాస్త్రముయొక్క సిద్ధాంతములబట్టి అందరికిని శస్త్రాధికారమున్నది. ఇంతియేకాక ప్రాచీనకాలములో హిందూసమాజపరిస్థితి యేరీతిగానుండెనో అనివిచారించగా కొత్తపరిస్థితులనుబట్టి ఆయాకాలములకు ఉపయోగించునట్టి ఉద్దేశ్యములతో వ్రాయబడిన క్రొత్తధర్మశాస్త్రగ్రంథములు విశేషముగానుపయోగార్థములుకావు. నిజముగాచూచిన రౌడీల సమాజముయొక్క ప్రతిబింబము భాషయందు బహుచక్కగానిద్దష్టముగాకనుపించును.

"బ్రాహ్మణకోష్ఠికే సంజ్ఞాయామ్" అనుపాణినిసూత్రము ౫-౨-౭౧ కలదు, దీనికిఅర్థమేమనగా అయుధములతో జీవనముచేయు బ్రాహ్మణులుయేదేశమందుఉండగలరో ఆదేశమునకు "బ్రాహ్మణక"అనిపేరు. సంస్కృతవ్యాకరణమునకు ముఖ్యసూత్రములురచియించిన పాణినిమహర్షి గౌతమబుద్ధునికంటె పూర్వమేయుండిరని యిప్పుడునిర్వివాదముగ చెప్పవచ్చును. అనగారమారమి ఏసుక్రీస్తుకంటె అరునూరేండ్లకు మునుపుపాణిని యీసూత్రములవ్రాసెను. అకాలమందే బ్రాహ్మలుకూడ శస్త్రములనుపట్టుటయేగాక దేశములో కొన్నిభాగములలోపూర్తిగా శస్త్రజీవులైయుండిరని స్పష్టముగా తెలియుచున్నది. శస్త్రజీవి బ్రాహ్మణులకంటె సస్త్రములతో జీవనముచేయ్యని బ్రాహ్మణులు భిన్నులని యీసూత్రమునకు అర్థముకాదు. ఎందుకనగా, బ్రాహ్మణశబ్దముమీద వచ్చిన కఞ్ప్రత్యయము దేశభేదమునేచూపును గాని జాతిభేదముచూపదు. గనుక అట్టికాలములో బ్రాహ్మణులలోకూడ శస్త్రముబట్టుటకు సాధనముఅనియు శస్త్రముధరించుట శాస్త్రసమ్మతమనియు విశదమగును. ప్రాచీన ధర్మసూత్రకారుడగు గౌతమమహర్షి బ్రాహ్మణులకుకూడ శస్త్రధారణవిధిచియున్నాడు. గౌతమమహర్షి క్రీస్తుకుపూర్వము ౬౦౦ ఏండ్లక్రిందటివాడుతమ గ్రంథములను చక్కగాపరిశీలించిచూడగా క్షత్రియుడే శస్త్రముధరించుటకు అర్హుడనికాని యితరజాతివారుకారనికాని ధర్మశాస్త్రము నిర్ణయించలేదు. మహాభారతాదిగ్రంథములుచూడగా శస్త్రవిద్యలు నేర్పించుఆచార్యులు బ్రాహ్మలైయుండిరని తెలియుచున్నది. అహింసాపరులైన బ్రాహ్మలకే శస్త్రాధికారము కలిగియున్నపుడు వైశ్యులకు శూద్రులకు యిట్టియధికారముకలిగియుండుటసహజమే కనుక ధర్మశాస్త్రరీత్యా హిందూసామాన్యుడు శస్త్రముధరించుటకు అర్హుడని నిస్సందేహముగ చెప్పవచ్చును.

ఇదిగాక క్రిందనుదహరింప బడుధర్మశాస్త్రవచనములచేత సర్వకాలసర్వావస్థలయందు బ్రాహ్మణునికి శస్త్రధారణము విధ్యుక్తమేకాని నిషేధముకానేరదు లోకమందు ఒకగుణము ప్రబలించినప్పుడు మరియొకవిరుద్ధగుణముబుట్టుటప్రకృతిసిద్ధమైనవిషయమే. శస్త్రధారులుప్రబలించి తమోగుణమతిశయింపజేసినప్పుడు వినాశమునహజముగాచేయవలసివచ్చును. సత్వప్రధానకాలములోకూడ సత్యాలమందు బ్రాహ్మణునికి శస్త్రముధరించుటకు గౌతముడు సెలవిచ్చినాడు "ఆపత్కాలే బ్రాహ్మణోపి శస్త్రమాదదీత" సత్వప్రధానమైన సాత్త్విక భావములతో వెలుగుచుండినభాగవతమందు "నీదణ్ణపి ప్రోవణిగ్వ్యత్యాపన్నైవేనాపదంతరేత్ ఖడ్గేనవాపదాక్రాంతో నశ్వవృత్యాకదాచన" అనిచెప్పినారు.

మహాభారతమందు ద్రోణాచార్య కృపాచార్యాది ద్విజశ్రేష్ఠులు ధనుర్విద్యాపారంగతులై క్షత్రియకులమునకుగురువులైనది ఆబాలగోపాలమువిదితమె.

"అగ్రతశ్చతురోవేదాః పృష్ఠతశ్శరంధనుః ఇదంబ్రాహ్మ్యమిదంక్షాత్రంశాపాదపిశరాదపి"

అనునట్టివీరగర్జనము ప్రపంచమంతటవినిపించుచున్నది. మొన్న మొన్నటివరకు బ్రాహ్మణరాజ్యములు కలుంగలేదా. శస్త్రధారణములేకనే రాజ్యరథమును నడిపించియుండిరా? బ్రహ్మతేజమునప్రకాశిస్తున్న యోగీంద్రులైన వసిష్ఠమహర్షిప్రవరుండు శ్రీరామాదులకుశస్త్ర పాండిత్యమునుఉపదేశించలేదా ఈశూరతేజస్వి మునిపుంగవునుచూచియే విశ్వామిత్రుడు "ధిగ్బలంక్షత్రియబలం బ్రహ్మతేజోబలంబలం" అనిని వచించడంకూడ శస్త్రధారణమునకేనిదర్శనము.

క్రీస్తుశకానికిపూర్వము ౧౮౫వ సంవత్సరమునుండి సుమారు ౨౦౦సంవత్సరాలు శుంగవంశమువారురాజ్యముచేసిరి. పుష్యమిత్రునిసంతతివారగుఅగ్నిమిత్ర, వరుణమిత్ర,భాగవత,దేవభూతిఅనువారలందరును బ్రాహ్మణరాజులే. వారుచండప్రచండులై క్షత్రియులనోడించి ఉత్తరహిందూస్థానములో గొప్పసామ్రాజ్యములనువేలిరి. నిన్న మొన్నటివరకుఆంధ్రదేశములోబ్రాహ్మణవీరులనేకమందియుండిరి, కాకతీయులకు, విజయనగర రాజులకుతురకు గోలకొండనవాబులకు మంత్రులై సేనానులై, అఖండశౌర్యమును ప్రకటించువీరులుబ్రాహ్మణులలోయుండిరి. రాజపుత్రస్త్రీలవంటి శత్రుభయంకరశౌర్యము ప్రపంచములోనుకే దేశములోను ఏకాలములోనుప్రకటితముకాలేదు.

( ౯ వ పేజీ చూడుడు)













### చందాదారులకు మనవి

చందాదారులు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునపుడు, మనిఆర్డర్లు బంపునపుడు, తమ చందానెంబరు వ్రాయుటయందు తగుశ్రద్ధ గైకొనుటలేదు. చందా నెంబరు వ్రాయనిది వెంటనే జవాబీయుటకు వలనుపడదు. కాన చందాదారులెల్ల ముఖ్యముగ గమనింపకోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర మాఘ శు॥ ౮

గురువారము


## మన పశుసంపద

మన భారత దేశములో మనుష్యులకు గాని పశువులకుగాని కొదువలేదు. మొత్తము ప్రపంచములోని జనులలో అయిదవ వంతుమంది మన దేశములోనే యున్నారు. మొత్తము ప్రపంచములోని పశువులలో మూడవవంతుపశువులుమన దేశములోనే యున్నవి. ప్రపంచములో మొత్తము వ్యవసాయ పశువులు ౭౦కోట్లు-అందు ౨౦కోట్లపశువులు మన హిందూస్థానములో ఉన్నవి.

అయితే మనగతి, మనపశువులగతి, ప్రపంచములో నెల్లను అధోగతిపాలైయున్నది. అనేక నాగరిక దేశాలలో పశువులకుండు సౌఖ్యము మనభారత దేశములో మనుష్యులకులేదు- మనకును, మన పశువులకును అంతగా భేదముకానరాదు. మనకుతిండిసరిగాలేదు. మనపశువులకును మేతసరిగాలేదు. మనము అల్పాయుష్కులమే-మనపశువులునూఅట్టివే. మనకు విద్యరానందున పశుతుల్యుల మైనాము. మనకు దరిద్రమెక్కువగుటచేత మనమున్నూ మనపశువులున్నూ ఒకే యింటిలో సంసారము చేయుదుము. పశువులుచేసేపని మనకూలీలు చేయుచుందురు. మూటలుమోయుదురు. బండ్లులాగుదురు. రిక్షాలులాగుదురు. ఏతమెత్తుదురు. ఇట్టివెన్నైనను చేయుదురు.

మనకిప్పుడు వ్యవసాయమే ముఖ్యజీవనాధారమైనది. నూటికి ౭౦వంతుమంది వ్యవసాయముపై ఆధారపడినారు. కాని మనభూములు నిస్సారమైనవి. మన పశువులు బలహీనమైనవి. మన ఆవులుబఱ్ఱెలు సరిగా పాలియ్యవు. మనపంటలు చాలా హీనమైనవి. దీనికంతటికీ కారణమేమి? కొంతవరకు మనమే మన దారిద్ర్యానికి బాధ్యులమై యున్నాము- మరికొంత ప్రభుత్వముయొక్క అశ్రద్ధ. మనకంటె వెనుకబడిన దేశములన్నియు యీ ౫౦ ఏండ్లలో చాలాముందుకు పోయియుండుటకుకారణము ఆదేశాలలోని ప్రభుత్వముయొక్క శ్రద్ధయే అని చెప్పుటకు సందేహములేదు.

మనము వ్యవసాయములో వృద్ధికిరావలెననిన మనముమనపశువులను బాగుగా విచారించుకోవలెను. వాటిని పుష్టిగా ఆరోగ్యముగా ఉంచుకోవలెను. వాటిని మంచిఉపయోగమునకు తీసుకొనిరావలెను.

మన దేశములోని ౨౦కోట్ల వ్యవసాయపశువులనుండి మనకు ఏటేట ౧౦౦౦ కోట్లరూపాయిల ఆదాయము వచ్చుచున్నదని డాక్టర్ రైట్ అనువారుఅంచనావేసినారు. మనదేశములో ఉన్నపశువులలో మూడవవంతుమాత్రమే అమెరికాలోనూ రష్యాలోను ఉన్నవి. మన దేశములోని పశువులసంఖ్యలో ముప్పైయవ వంతుపశువులు మాత్రమే అనగా ౨౦లక్షల పశువులుమాత్రమే యింగ్లాండులో ఉన్నవి.

మనకు పాలనుండి ఏటేట ౩౦౦ కోట్లరూపాయిలున్ను, తోళ్లనుండి ౪౦ కోట్ల రూపాయిలున్ను ఎరువుల నుండి ౨౭౦కోట్ల రూపాలున్ను ఆదాయము కలుగుచున్నదని అంచనా వేయబడినది అయితే యీఆదాయాన్ని వృద్ధిచేయుటకు వీలులేదా? అనిన అపారముగా కలదని చెప్పవలెను.

మనము పశువులనుపెంచుటను మొదట నేర్చుకొనవలెను- దీనికి ప్రభుత్వమువారు తోడ్పడవలెను. ఊరూర రెండు మూడు విత్తనము కోడెలుంచి పశువులమేతకై కొంతభూమిని బంజరుగా ఏర్పాటుచేసి పనికిరానికోడెలను విత్తనముకోడెలుగా నుండకుండునట్లుచేసి రైతులనుప్రోత్సహించిన ఈపని బాగుగా వృద్ధి యగును. రైతులకుపశువులు చచ్చుటవలన కలుగునష్టము అన్నినష్టాలకన్న యెక్కువయైన నష్టము. పెద్ద రోగము, గాలి, వంటి రోగాలు వచ్చిన ఊరూర మంచిమంచి పశువులన్నియు పడిపోవును. ఈరోగాలను నిరోధించుటకై ముందుముందే నిర్బంధముగా పశువులకు టీకాలుతీయించుట ప్రభుత్వమువారి విధియైయుండును.

పశువులయెరువులు రెండవముఖ్యాంశము- మన రైతులు పేడమపిడకలుగా చేసి కాల్చుదురు. దానివలన భూములకుసారములేక పంటలుపండవు. పిడకలు చేయవద్దని రైతులకెంతచెప్పినను, వారు వినరు. తుదకు దీనికిని ఒకశాసనమే అవసరమోయేమో! పిడకలులేకుంటే పొయ్యిలెట్లుకాగును. కట్టెలులేనిచోట పిడకలే కదాయని యందురు. ఇదిసరియైనవాదముకాదు. మన దేశములో ఉన్నట్టిఅడవులు మరేదేశానను లేవు- పైగా రైతులు తమవంటి యెట్లైనను శ్రమచేసి కట్టెలనో పుల్లలనో సంపాదించుకొనవలెనుకాని పేడనుమాత్రము ఏమాత్రమును వ్యర్థముచేయరాదు.

మనఆవులు బఱ్ఱెలు చాలాకొద్దిగా పాలిచ్చును. మొత్తము ప్రపంచములో ఆవును పూజించేవారొక్క హిందువులే. శివుని వాహనమునంది. కృష్ణుడు గోపాలకుడు. దేవలోకపు సర్వప్రదాతి కామధేనువు. గోవు మాతృస్వరూపము. నంది కేశ్వరుడు జనవేశ్వరుడు హిందువులకు పూజ్యులు. అట్లుండినను భారతదేశానికి డెన్మార్కునుండి, స్విస్ దేశమునుండి డబ్బాపాలు దిగుమతియగును. తుదకు ఇంగ్లాండునుండికూడ పాలపొడి దిగుమతి యగుచున్నది. దీన్నిబట్టిచూడ గోమాతను మనముపూజించువారముకాక దొంగవేషాలువేయు కపటులమని వ్యక్తమగును. నిజముగా గోమాతసేవచేసియుండిన మనమే సగము ప్రపంచానికి డబ్బాపాలను సృష్టిచేయగలిగి యుండెడివారము.

మన అదృష్టవిశేషముచేత మనపశువు[illegible] అభివృద్ధికై [illegible] నుస్ట్రెసాయి గారు మనకులభించినారు.

---

### గాంధీగారుహిట్లరుకు వ్రాసినజాబు

మహాత్మా గాంధీ గారు కొన్నిదినాలక్రిందట హిట్లరుచర్యలను ఖండించుచు ఒకజాబును హిట్లరుకుపంపుటకై వ్రాసిరి. దానిని బ్రిటిషుప్రభుత్వమువారికిచ్చి పంపుటకై కోరిరి. కాని ప్రభుత్వమువారు దానినిపంపలేదు. ఆజాబులో గాంధీగారిట్లు వ్రాసియుండిరని మహాదేవదేశాయిగారు ప్రకటించియున్నారు.

"మీరుహిందూస్థానముపై దండెత్తివచ్చినచో మీతోసహాయనిరాకరణ ప్రతిఘటన తీవ్రముగాజరుగును. మమ్ము నాశనముచేసి మీరుమాభూములను మాశరీరాలను వశపరచుకొనగలరు. కానిమా ఆత్మలను మీరువశపరచుకొనజాలరు, మాదేశములో ప్రతిపురుషుని, స్త్రీని, శిశువునువధచేసి మాశరీరాలను మాఆస్తులను వశపరచుకొనవలసివచ్చును. దేశమందలిజనులందరు అంతట మహాత్యాగశక్తిని ప్రకటించకపోవచ్చును, మీభయంకరకృత్యాలచే మాతిరుగుబాటును అణచివేయవచ్చును. భారతదేశములో తగినంతమంది పురుషులు స్త్రీలును మీమెప్రకోవముతేనివారై మిమ్ము ప్రతిఘటించి తమప్రాణాలను అర్పించుటకు సిద్ధమైనచో హింసాదౌర్జన్యమునుండి విముక్తిపొందుమార్గమును వారు చూపినవారగుదురు. మీరనుకొనంతటి సంఖ్యలో మాజనులు ప్రతిఘటింతురని నేనుచెప్పిన మీరువిశ్వసింపవలెను,

మీసొంతవ్రాతలవల్లను, ఉపన్యాసాలవల్లను, మీస్నేహితుల అభిప్రాయాలమూటలవల్లను మీచర్యలలో విశేషభాగము రాక్షసత్వముతోకూడినవనుటలో సందేహములేదు. అవిమానవగంభీరతకు అర్హమైనవికూడాకావు నేను సర్వప్రపంచమిత్రత్వమును కాంక్షించుచు నాయట్టివారిదృష్టిలో మీచర్యలు గర్హ్యములు జెక్కొదేశమును మీరుఅవమానపరచుట, పోలెండును భంగపరచుట, డెన్మార్కును ఆమాంతము గామింగివేయుట, ఈచర్యలు ఘోరమైనవి, మీదృష్టిప్రకారము అట్టిచర్యలుఉత్తమమైనవని భావించుకొనుట నేనెరుగుదును. కానిమాకు మాబాల్యమునుండియు అట్టిచర్యలు మానవత్వమును హీనముగాచేయునట్టివని బోధింపబడినవి. అందుచేత మేముమీకు జయమునుకోరము. ముందుకాలములో మీజనులు మిమ్ము తిలకించి గర్వించునట్టి అర్జనను మీరువదలిపోవుటలేను ఎంతచమత్కారముతో ఘోరకృత్యాలను మీరు చేసినవారైనను మీకార్యములను ముందుకాలములోని మీజనులు అభినందింపజాలరు మానవత్వముపక్షమున మీరుయుద్ధమును విరమించవలెననికోరుచున్నాను'

---

## తుర్కీకి హిట్లరు సందేశము

తుర్కీలోని ఇస్తాంబుల్లో మొన్నటివలేదిన ఒకజర్మనువిమానము దిగెను. అందులోనుండి హిట్లరుగారివద్దనుండి తుర్కీప్రధానికి ఒకసందేశం తెచ్చిన ప్రత్యేకదూత దిగియుండవచ్చునని అనుకొనుచున్నారు.

---

వారు ౧౯౩౬లో ఇండియాలో కాలుపెట్టగానే ఇట్లుసెలవిచ్చినారు. "మీరు ఇండియాకు సహాయము చేయదలచిన రైతుల నాదరించుడు. వారికి సహాయముచేయుట అనినవారి పశువులనువృద్ధిచేయుటయే" గతసంవత్సరము సిమ్లాలో పశుప్రదర్శన సందర్భములోను వారిట్లుసెలవిచ్చిరి. "గ్రామజీవితమును నేను గమనించేకొలది పశువులను వృద్ధిచేయుటయే ముఖ్యమైన పనిఅని నాకుబాగు గాతోచినది."

నిజాంరాష్ట్రములో తెలంగాణా రైతులు [illegible]. వారిపశువులు లెక్కకురానట్టివి వాటిఆయవ్యయము మొత్తముమీద చాలా కొద్దిపాటిదే. మనప్రభుత్వమువారు రైతుల పశువుల అభివృద్ధికై కొలుకొద్ది ప్రయత్నము చేయుచున్నారు. ఇంకను ఎక్కువగా చేయు అవసరము కలదు.

---

## ని. రా. ఆంధ్రమహాసభలకు సూచన

### సాహిత్యము కళలఅభివృద్ధికై-అవసరమైన ఏర్పాటు

ఆంధ్రమహాశయులారా:

మననిజాంరాష్ట్రమున ఆంధ్రోద్యమము ప్రారంభమై ఇప్పటికిసుమారు. ముప్పదియేండ్లు దాటినదనుకుందును. క్రమముగా జిల్లామహాసభలనీ తాలూకామహాసభలనీ అభివృద్ధియగుచూ వచ్చినమాట వాస్తవము, ఈమహాసభలతోనే గ్రంథాలయసంఘసభలను ఈయేడు అనుసంధింపబూనుట శ్రేయదాయకమైన ఒకవిశేషము సంస్కృతియనునది బహుముఖములుగలది, అది రాజకీయము మతము సాంఘికము సాహిత్యము సారస్వతము-వివిధకళలు మొదలగువిషయములుకాగా మనరాష్ట్రసభలలో మొదటి రెండుమూడు విషయములుమాత్రమే చర్చింపబడుచూవచ్చుచున్నవి. ఈసంవత్సరము సారస్వతానుబంధమైన గ్రంథాలయసంఘసభలను జోడించుట విశేషమనిచెప్పితిని. మిగిలినవి సాహిత్యము-కళలు అదియైనవి మనకిదివరలో సాహిత్యపరిషత్తులు గానకళాపరిషత్తు చిత్రకళాచార్మికళ సంఘములు. ఇంకను ఆయుర్వేదము జ్యోతిషము అప్పైనపండితపరిషత్తులుఎన్నో విడివిడిగాయుండవలసినవి.అట్లుండిగాని కార్యాలయములు పనులు ప్రత్యేకముగా జరుగుచూ ఏకముఖమున సాంవత్సరిక ప్రదర్శనములుగాని జరుగుచుండుటలేదు. మనకును మనసోదరాంధ్రదేశమువందువలె సర్వసంగతులు అభివర్ధమానమగుచుండుట కోరనివారెవ్వరు? కోరుదురనుకొనుడు. అంతమాత్రమునచే ఆగులాభము? నీటిలో చేతిమంచిన దప్పిదీరునా? అన్నట్లు:

ఆయినచేమిచేయవలెను? అదియేగదా ప్రశ్న? మనకు ఎనిమిదిజిల్లాలున్నవి (తెలంగాణా, విద్యాధికులు ఉత్సాహవంతులు కళాప్రియులు కళాకుశలులు చాలమందిగలరు రత్నమైనను సానదీరినగాని ప్రకాశించనట్లువీరును, భిన్నప్రకృతులకు అనుగుణమైన భిన్నభిన్న సంస్థలుజెలసి పనిచేయవలెను. నాదేవానుపైకిం గలుగుదురు. అనాటివి జ్ఞానమే సల్వతోముఖాభివృద్ధిగలదగను. అట్టి సంస్థలులేక పరిషత్తులనుడు, ఏమనినను స్థాపించి సోదరదేశమువలెనే ముందుకుసాగవలెను. లేదా ఇంకొంక సులభపద్ధతియున్నది.ప్రస్తుతముగ్రంథాలయసంఘసభనను సంధానించినట్లే పైనచెప్పిన నాట్యగాన సాహిత్యాది పరిషత్తులను ఆంధ్రమహాసభలతో చేరలిపి రెండురోజులసభలను మూడురోజులుగా నిట్లుపొడిగించి పైపరిషత్తులకొక్కొక్కపూటనిచ్చి అప్రమేయముజరిగింపుకొనునట్లుచేయవలెను. ఆరెండుమూడురోజులకాలమును సందర్భోచితముగ వినియోగించి వివిధశాఖలుగా పనిచేయవలెను అది మనవాతావరణమునకును పరిపక్వతరీతియనుకొందును. ప్రస్తుత మనరాష్ట్రవిద్యాభివృద్ధిని చూచినయెడల వివిధసంఘములు వేర్వేరుగా సభలుజరుపుకొనుటయు కష్టసాధ్యమే ఆంధ్రమహాసభలవారే వీటినికవుప్రకునికార్యక్రమనుసాగించిన సర్వాంగ సుందరముగానుండగలవు-ఇవన్నీ కాదనినయెడల నింకొకమార్గముగలదు- అది ఈ సంవత్సరము నవ్యసాహిత్యపరిషత్తును మనరాష్ట్రమునకాహ్వానించినట్లే ప్రతిసంవత్సరము నేదోయొకపరిషత్సభనుజరుపుట శేర్పాట్లనుచేసికొనినను బాగుగనేయుండును- ప్రసరయేటాసభలనెవరాహ్వానింతురు? అమాటయు నిజమే- అందుకొఱకేఆయాయాకళాసంస్థలను వాటివాటియందుఅభిమానోత్సాహములుగలవారిచేత ఆటిసలములలో నాయాశాఖలను స్థాపించి పైనచెప్పినపద్ధతినిజరుపుకొనినను సమంజసముగనేయుండును- ఇంకునేను సూచించినకార్యకలాపమును రాష్ట్రకేంద్రజిల్లా, తాలూకాసంఘములవారేవారి పరిధిలోపరుగునట్లుచేయవలెను- ప్రకృతమున నేనుచేయదలచిన సూచనలాంధ్రమహాసభలు చేయుచున్న, చేసినపనుల తప్పొప్పులనువాచించుటకాదు చేయవలసినదానిని మాత్రమే సూచింపదలచినాను- నిజముగాననఆంధ్రమహాసభలు చేటివరకు జేమిచేసినను- ఎంతజేసినను ఒప్పునదే.గొప్పనియేతలంచువారిలో నేనొకడను- ప్రశంసనీకళావిభూతి మైయుండవలెను. చూడుడు! సర్వసాధారణముగాపనము ఏపదర్శనం [illegible] లోపముగనిప్పించిన కళావివానముగారు న్నదేదుడు-

నిజాంరాష్ట్రాంధ్రమహాశయులు- సభలవారు [illegible]

ఇట్లు

బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

---

## సత్యాగ్రహానికై

### విజయనగరం మహారాజ కుమార్ గారి కోరిక

గాంధిమహాత్ముని నిరాకరణ

సత్యాగ్రహంచేయుటకు విజయనగరం మహారాజ కుమార్ సర్ విజయాగారు గాంధి మహాత్ముని అనుమతివేడిరి. కాని సర్ విజయాగారి సతియు, బంధువులును యిష్టపడలేదనియు, అదియుగాక సర్ విజయాగారే సత్యాగ్రహప్రమాణ పుషరతులన్నిటిని పూర్తిగానిర్వర్తించలేదనియు గాంధిమహాత్ముడుఅనుజ్ఞనీయవీలులేదనితెల్పెను. సర్ విజయగారుపత్రికా విలేఖరితో సంభాషించుచుసేవాగ్రామందర్శించుటవల్ల విజ్ఞానవృద్ధియగుననియు, అక్కడిఆశ్రమవాసులకు ఉన్నశాధర్యములలవడుననియు చెప్పిరి. హిందూమహమ్మదీయుల ఐకమత్యము సిద్ధించునను దృఢవిశ్వాసము గాంధిమహాత్మునికి గలదనిరి.

---

## జనపరిగణననిమ్న జాతులు

అంబేద్కరీయ యువకసంఘము యొక్క పూర్వ కార్యదర్శి, పి. ఆర్. వెంకటస్వామి, బి ఏ. గారిట్లు ప్రకటించగోరినారు:-

హైదరాబాదు నిమ్న జాతులవారి స్వయంభు నాయకులు జనపరిగణనగురించి ఏమోగొప్పగా మాట్లాడుచు వాకగాప్రఖ్యాతినిసంపాదించుకొనుచున్నారు. కొన్నిరోజులకుపూర్వము నిమ్న జాతులసంఘము (డిప్రెస్డు క్లాసెస్ అసోసియేషన్) యొక్క అగ్రస్థులవారుకూడ ఒకపెద్దప్రకటనలో "సంఘముయొక్క కార్యనిర్వాహకవర్గము యొక్కసభ్యులలో ఇష్టాగోష్ఠిగా ఆలోచించిన తర్వాత సంఘమునందలి ప్రముఖులైనసభ్యులను హిందువులయొక్కయు, ఆర్యసమాజీయులయొక్కయు ప్రచారమునుప్రతిఘటించుటకై జిల్లాలకుపంపనైనది." అనివెల్లడించినారు. ఇదిఅంతయు ఖ్యమైనదైతే, అధ్యక్షులవారు సభ్యులలో ఇష్టాగోష్ఠిగా [illegible] అసలుఅధికారపద్ధతిలోనే ఎందుకులోచనలుచేసియుండరాదు? కనుదిదారించగా ఆప్రకటనలో సత్యమంతయు తేటయేయగునియు, చెప్పుకొనదగినవారెవరును జిల్లాలకుపంపబడియుండలేదనియు తెలిసినది. వాస్తవంలో ఏదో కొందరుజంగాలు కొద్దిమంది కోలకులను వెంటబెట్టుకొని రాజమండ్రివారగు కుసుమ ధర్మన్నకవి గారి నాయకత్వంలో జిల్లాలలో తిరిగివచ్చుటకు పోయిరి. (కుసుమధర్మన్నకవి ఎవరనగా హిందూమతంలోనుంచి తెచ్చిపోకరనని ఆందోళన సాగించుచున్న రోజులలో 'జనభేరి'అనేతనవారపత్రికలోనిమ్న జాతులవారలు ఇస్లాంమతానికిమారవలెనని ప్రచారముచేయుచుండిన ఆపెద్దమనుష్యులే. అప్పటికపు హైదరాబాదులోఉదారులైన ముసల్మానులు ధనసహాయము చేయుచుండిరి. ఆకవిగారిపుత్రులు మూడునెలలనుండి మధ్యలో ఆగిపోయియుండిన నవవారపత్రికనుపునరుద్ధరించుటకై గొప్పగొప్ప ముసల్మానులవద్దకుతిరుగుచు ధనసహాయముకోరుచున్నారు.)

ఇంతమంచిఆశ్చర్యకరమైన సంగతిచూచినారా! అసలుసంఘముయొక్క ఆర్థికస్థితియేకష్టంగాఉన్నప్పుడుదాని అధ్యక్షులవారు కుసుమధర్మన్నకవి గారిగోలిపి, జిల్లాలకుప్రచారకులను పంపించిపనిచేయుటకుపూనినారు. నిమ్న జాతులవారలతమపేరులను "ఆదిజన" అని జనపరిగణనపత్రాలలో వ్రాయించవలసినదిగా బోధించవలెనని ఆప్రచారకులకాజ్ఞచేయబడినట్లువిన్నాను. ఇదేదోఈక్రొత్తపేరు జనపరిగణనపత్రాలలోకెవరాదు. ఇప్పటికే "ఆదిహిందువులు", "ఆదిశావిడులు", "మహానాటులు", "అనంధతీయులు", "శబరులు", "ఆదినివాసులు", "హరిజనులు" మున్నగుపేర్లు నోటలోపట్టలేదు. ఇప్పుడుమళ్ళీ "ఆదిజనులు" అని పెట్టినకొత్తపేరు ఏమి తెలియని మనసోదరులను గందరగోళపెట్టగలదు.

ఈవిధంగా నిమ్న జాతులవారి నాయకులమని చెప్పుకొనేవారు చేసేచిత్రవిచిత్రచర్యలు నిమ్న జాతులవారల మనస్సులలో అనుమానాలను పుట్టిస్తున్నవి.

# ౧౩౪౯ ఫ. లో సహకార సంఘాల స్థితి

## రిజిష్ట్రారుగారి నివేదిక

మ. ఘ. వ. నిజాం ప్రభుత్వమువారి సహకార శాఖయొక్క ౧౩౪౯ఫ. నివేదికలో సహకారోద్యమము వ్యవసాయమును నకుఅనుకూలముకాని పరిస్థితులవల్ల బాధ ననుభవించవలసివచ్చెనని తెలుపబడినది.

ఈసంవత్సరంలో సహకారసంఘాల సభ్యుల సంఖ్య ౧౨౦౪౬౫నుండి ౧౪౬౮౭౯ కి హెచ్చెను. ౨౭౮ క్రొత్త సంఘములు స్థాపించబడినవి. సంవత్సరాంతంలో లెక్కలోనుండిన సంఘాలసంఖ్య ౪౪౩౪౩నుండి ౪౬౫౩కి హెచ్చెను. అందువల్లన మొత్తము అన్ని సంఘాలుపనిచేయుటకు లభించిన మూలధనము రూ ౨౬౯౯౭౩౨౦ నుండి రూ ౨౪౪౩౩౧౧ కు హెచ్చెను.

### కేంద్ర సహకార సంఘము

కేంద్రసహకార సంఘముయొక్క ఆర్థికస్థితి కాలమానస్థితి బాగుండనందువల్ల దెబ్బతిన్నదిగాని, ఆసంఘముచేసే ప్రచారప్రబోధములను పూర్వమువలెనే చేసినది. ఆ సంఘము చందాలరూపంగా సంఘాలనుండి రాబట్టిన మొత్తము కాలమానస్థితి దోషమువల్ల రూ౨౦౦౦నుండి రూ౧౦౦౦నుండి రూ౫౯౬౪కు తగ్గెను ప్రభుత్వమువారప్పుడు ఆదుకొని రూ౧౫౦౦౦లు సహాయము మంజూరు చేసిరి.

### డొమినియన్ బ్యాంకు

డొమినియన్ బ్యాంకుయొక్క ఆర్థికస్థితి పూర్వమువలెనే దిట్టముగానుండెను. ఈబ్యాంకు నిర్ణీత వాటాలకుగాను వసూలైన మూలధనము రూ౫౭౯౨౦. దీని రిజర్వునిధులు రూ ౧౦౫౩౫౧౬౬– దీని మొత్తము మూలధనము రూ౧౫౬౩౬౪– ఈబ్యాంకు ఇతరులకీయవలసిన మొత్తము రూ ౨౨౭౪౫౧౪– సెంట్రల్ బ్యాంకులతోను, సహకారసంఘాలతోను దీనివ్యాపారము హెచ్చెను. ఆసంఘాలకిది ౧౩౪౬–౪౩ సంవత్సరంలో రూ౩౧౨౯౪లుమాత్రమే ఇచ్చియుండెను– ఈనివేదిక సంవత్సరంలో ఇట్లివ్వబడిన మొత్తము రూ౨౦౭౪౩౫లు–

### సెంట్రల్ బ్యాంకులు

సెంట్రల్ బ్యాంకులలో ప్రాతవాటిపై పూర్వసంవత్సరముల బకాయలభారము ఎక్కువగానుండెను– మొత్తముమీద సెంట్రల్ బ్యాంకులస్థితి నివేదిక సంవత్సరానికిపూర్వంలోకంటె ఏమంతబాగుపడలేదు– కాలమానస్థితిబాగుండక పోవుటయే దీనికికారణమైయుండును– మరియు సెంట్రల్ బ్యాంకు యొకటి రిజిస్టరుచేయబడుటవల్ల మొత్తము ౪౦ సెంట్రల్ బ్యాంకులయ్యెను–వాటిసభ్యులసంఖ్య ౪౫౦౬నుండి ౪౬౭౫కు హెచ్చెను– వాటివాడుకలోనుండిన మూలధనము ౬౪౫౯౩౫ లనుండి రూ౬౫౦౭౨౮౨కు హెచ్చెను–సభ్యులుచెల్లించిన వాటాల మొత్తము రూ౧౧౫౭౩౭౪లుగానుండెను– రిజర్వునిధులలో రూ౧౩౦౭౫౧౧లుండెను–

### వ్యవసాయ పరపతి సంఘాలు

వ్యవసాయ పరపతిసంఘాలు ౨౬౭౩నుండి ౨౭౦౯కి హెచ్చెను, వాటి సభ్యులసంఖ్య ౫౬౫౬౧నుండి ౬౩౩౫౭కి హెచ్చెను. వీటివాడుకలోనున్న మూలధనము రూ౭౩౪౪౭౩౫లనుండి రూ౭౬౫౩౧౭౫లకు హెచ్చెను. మొత్తము వీటి నిర్ణీతములైనవాటాలు రూ ౪౦౩౦౭౯నుండి రూ౪౧౧౧౭౪కి హెచ్చెను– పరిస్థితులు ఎంత ప్రతికూలములైనను వాటిస్థితి పాడుకాలేదు–

### వ్యవసాయేతర సహకార సంఘాలు

వ్యవసాయేతర సహకారసంఘాల సంఖ్య ౬౧౨నుండి ౬౫౯కిని, వాటి సభ్యులసంఖ్య ౪౩౭౦౦నుండి ౫౨౬౨౭కిని హెచ్చెను– వీటి వాడుకలోని మూలధనము రూ౫౧౧౬౩౭౨నుండి రూ౫౩౭౩౯౭౪లకు హెచ్చెను. నెలజీతాల పనివారల సహకారసంఘాలు మంచిఅభివృద్ధిలో నుండినవి–వాటిసభ్యులసంఖ్య ౧౯౦౫౭–వాటివాడుకలోనున్న మూలధనము రూ౩౪౪ ౨౧౪లు–

### సహకార భీమాసంఘము

ఈసంఘముయొక్క పట్టాదారులసంఖ్య నివేదిక సంవత్సరాంతమందు ౧౧౪౩వారలు. భీమా చేయించిన మొత్తాలుకలిసి రూ౧౯౩౭౨౪ దాని మొత్తములాభము రూ౨౧౫౩లు. వసూలైనవాటాలపై (ప్రతిశతిర౦౦తున డివిడెండు (వాటాదారులలాభము) పంచిపెట్టబడినది–ఈసంఘానికి ప్రభుత్వంవారు రూ౧౦౦౦౦లను సహకారభీమా వలనిలాభాలను గ్రామప్రజలకు బోధించుటకై సహాయముచేసిరి.

## చెరువు పరిష్కారము

(ఒకవిలేఖరి) బసంపల్లె, ఫర్వర్ది ౨౭

ఈ గ్రామము సిద్దిపేటతాలూకాలో చేరినది. ఈసంవత్సరం ఇస్ఫందారునెల మొదలులో తాలూకాఫీసరుగారు దయచేసి చెరువుకొలతకొలచివెళ్ళినారుగాని దానికి విరుద్ధముగా ఒకరిద్దరు భూస్వాములు వారివిచెరువుకిందుపులో ౨,౩ బావులున్నందున చెరువు మరమ్మతుకానివ్వరని చాలానమ్మిక. ఇదివరలోగూడా ఇట్లేజరిగినది. ఈ చెరువుకింద ౧౩౩౬ఎకరములభూమి సేద్యంఅవుతున్నది. మరమ్మతుచేసిన మరి (౫౦)ఎకరములు సేద్యంకాగలవు ఇప్పుడే సంగ్రీకి ౩౦౦౦రూపాయలపైన అవీనములుఉన్నది కాని వర్షాకాలములో రెండుసారునిండినేగాని పంటకూడా పండదు వేసవికాలము పశువులకు చాకలివారలకు నీళ్ళకష్టము మొదటికే నీరుండదు ఇప్పుడే ఈగతి చైత్రవైశాఖమాసములు ఎట్లుజరుగునో గునిదేవుకే తెలియును. మరియు ఈచెరువుకింద చాలాబావులుఉండి వాని "జర్యాముస్తిరికా" పెట్టినారు. అల్కిాన్,ఎండిన సంవత్సరకంమా త్రంతప్పను. ఈబావులలో పెద్దనువులండ నీళ్ళు వర్షాకాలమేతప్ప ఇవుడుండవు. ఏఒకటిరెండు బావులకింద కొద్దిగాసేద్యంఅవుతుంటో అవిపండేవరకు అష్టకష్టాలుజరుగుతవి. రైతు ఈరీతిరకంతోనే దివాలాతీసినది. చాల్బుబాధ అనుభవిస్తుయున్నది (పంటలు) రెండుతూములుఅలికితె పుట్టెడుపరిగపండుట లేదు. పట్టేదార్లకుసగంధాన్యం దారగళ్ళంసర్కారీ ఎకరమకి ౨౨౪ బొవన్యా పడ్డది. సగంభుక్తనాపంటరాదు. మీదుమిక్కిలి "వేసంగిముస్తరికాజర్యా" చాలాఘోరంగాఉంది– జమబందిలో మొఖ ఎవరుఅలకించరు– సొమ్ములు–బోర్లు–పశువులుకూడా అయిపోయిన వి–భూమిసాహుకార్లుపట్టకుండ అయినది. ఇకముందుదిక్కేమున్నదో తెలియదు–

# బల్గేరియాకు రష్యా ఆక్షేపణ

రష్యాప్రభుత్వ విదేశాంగశాఖవారు రష్యాలోని బల్గేరియారాయబారికి బల్గేరియాలో జర్మను సేనలప్రవేశము తమకాక్షేపణీయమని తెలిపినారు. ఆప్రదేశమువల్ల బాల్కాను ప్రాంతంవైపు యుద్ధము వ్యాపించవచ్చునని ఆక్షేపణయై యున్నది.









# గోలకొండ గ్రంథాలయము

## క్రొత్తబాట

కవి—పులిపాటి సూర్యప్రకాశరావుగారు పుటలు ౪౬, వెలరెండణాలు. ప్రకాశకులు నామ్మాళ్వార్ల పోస్టుబాక్సు ౨౪౧. మద్రాసు.

ఇంతకవితా పాటలుకొన్ని కలవు. అవియెట్లుగా పాడుకొనవలెనో తెలియదు. భావములలో గంభీరత ఉన్నదని పీఠికాకారులు వ్రాసినారు, ఇందలి తరే క పాటలు వచనములవలె ఉన్నవి. పెనసలనుగురించి యిట్లువ్రాసినారు.

పోతుంటేదారిలోన
పెనసలుదొరికింది
పేపరుమీద పెడితే
పద్యంవ్రాసింది
నేలమీద నాపద్యం
పడరానెల్లింది
సేయపడ్డపత్రికలో
ప్రకటితమైంది.
పలుగురుచదివారు
ఆనందించారు
నా పెనసలుమాటొక్కరికి
తలుపురారేదు

ఇట్టిపాటలెక్కగంథమందంతటకలవు.

## వత్సలుడు, వనవాటి

వి: అంబటిపూడి వేంకటరత్నంగారు. ౧ రూపాయి, దొరకుస్థలం సాహితీమేఖలకోటయ్యగూడెం, చండూరుపోస్టు. నల్లగొండజిల్లా స్లైజాకాగితాలు. మంచిముద్రణ. ఆకర్షణీయమగు స్వరూపము నాలుగుచిత్రపటాలు ఇందుకలవు

ఇందు రెండుభాగాలు. ఒకటివత్సలుడు అను రెండవదగువనవాటిఖండకావ్యము చిన్నచిన్నకర్ణనాంశములు ఈరెండవదానిలోకలవు.

కవితధారాళముగావున్నది. భావగ్రాంథిక ను భావమాలుగంభీరములు మొదటికథయగు వత్సలుడు అస్పష్టముగా ఉన్నది. కవిగారు కథలను అందరునూసులభముగా అర్థముచేసుకొనునట్టుగావ్రాసినబాగుండెడిది

రెండవఖండకావ్యములో కవిగారు వివిధాంశాలనువర్ణించినారు. కైతలనుగురించి ప్రకృతినిగురించి ఆంధ్రులనుగురించి, ఆంధ్రభాషనుగురించి యీవివిధాంశములనువర్ణించినారు. ఇదిమనోహరముగాఉన్నది.

## పత్రికా స్వీకరణము

### ఆంధ్రకేసరి

౧౨౧౮ సుల్తాన్‌బజారు హై. ద.

ఇదిఉత్సాహవంతులగు ఆంధ్రయువకులకృషి ఫలితంగా ఆయిదేండ్లక్రింద లిఖితమాసపత్రికగానుండి, గతమాఘమాసములో ముద్రిత ప్రచురణదశకువచ్చినట్టిది. దీనిసంపాదకులు శ్రీగుండవరము హనుమంతరావుగారు. ఇపుడు ముద్రితప్రచురణదశలో రెండవసంచికకూడ వెలువడినది. దీని విషయములు ప్రథమసంచికలో "తెలంగాణాయొక్క ప్రత్యేకఆర్థిక సాంఘికపరిస్థితులనుదృష్టిలోఉంచుకొని వారికినుబోధమైనశైలిలో, ఉపయోగకరములగువిషయములను తెలుపుట మొదటిది. రెండవది రాష్ట్రేతరాంధ్రులలో నేడుకలిగినవికాసమును, వారియొక్క ఆర్థికవిజ్ఞానకళాభివృద్ధులను నిజాం ప్రాంతీయాంధ్రులకు సవిమర్శనతోతెల్పుచు, వారిమధ్య పరస్పరైక్యము కలయికఏర్పరచుట, ఆంధ్రరాష్ట్రములో నేడువిజృంభించిన కథావాఙ్మయమును, గేయములను, ఖండకావ్యములను, నాటికలను—ఒకముక్కలో నవ్యసాహిత్యమును— ఇక్కడి నవ్యాంధ్రసాహిత్యోపాసకులకు ఎరుకపరచి, అఖిలాంధ్రవాఙ్మయాభివృద్ధికి స్థానికాంధ్రులుగూడా సహాయం చేసే అవకాశముకలిగించుట"యని చెప్పబడినవి.

ప్రథమసంచికలో శ్రీభోగరాజు పట్టాభిసీతారామయ్యగారి సందేశము అలంకారముగానున్నది. ప్రథమసంచికలో మనవ్యవసాయము, 'ఖగోళం' విశ్వవిద్యాలయములు జాతీయత" అనువిజ్ఞానవ్యాసాలు, కథలు, పద్యాలు, వార్తలుగలవు. రెండవసంచికలో "మనవ్యవసాయము" "లోకచుక్కలు"అనుజ్ఞానవ్యాసాలు, కథలు, పద్యాలు, వార్తలుగలవు. దీనిసంవత్సరచందా రూ ౧-౮-౦ విడిసంచికవెల ౨ అణాలు









## వెంటనే కావలయును

అనుభవముగల్గి చురుకుగా కంపోజుచేయగల్గిన కంపాజిటర్లు కావలెను. పనినిబట్టి వేతనము యివ్వబడును.

మేనేజరు
గోలకొండ పత్రిక

# ఇండోచైనా జపానుకు లొంగుట

## యుద్ధం తప్పించుకొనవలెననే ఆదుర్దాఫలితము

ఇండోచైనానుండి తాయిలాండువారు పూర్వము తమదిగానుండిన ప్రదేశమునిపుడు వాపసు చేయవలెనని కోరుచున్న విషయంలో చేయబడుచుండిన యుద్ధాన్ని ఆపివేయించి మధ్యస్థముగా నుండి వివాదపరిష్కారము చేయుటకు జపాను వారు ఒప్పుకొనియుండిరిగదా. ఇండోచైనా, తాయిలాండుల మధ్య సరిహద్దుగానుకొని మెకాంగు నదిచుట్టు ప్రక్కలనున్న ప్రదేశమును, ఇండోచైనాలోని లావాస్, కాంబోడియా రాష్ట్రములలో కొంతభాగమును ఇండోచైనావారు తమకొసగవలెనని తాయిలాండువారు కోరిరి. ౭౦ వేలచదరపు కిలో మీటర్లకైశాల్యముగల ఇంతపెద్దప్రదేశమును తాయిలాండువారికిచ్చుటకు ఇండోచైనావారికిష్టముగానుండెను. ఇండోచైనా తాయిలాండులకు రాజీకుదుర్చుటకై జపానుచేయుచున్న ప్రయత్నములు ఫిబ్రవరి ౨౮వ తేదివరకు పూర్తికానందువల్లను, ౨౮వ తేదినాడు ఇండోచైనా తాయిలాండుల యుద్ధవిరామపు ఒడంబడిక గడువుపూర్తిఅయ్యేటట్లు ఉండినందువల్లను, ఆ ఒడంబడిక గడువు మరి ౧౦ రోజులవరకు పెంచబడెను. మరల జపానువారు వేర్వేరుగా తాయిలాండు ప్రతినిధులతోను, ఫ్రెంచి ఇండోచైనా ప్రతినిధులతోను సంభాషణలు జరిపి వివాదపరిష్కారపు షరతులను ఫిబ్రవరి ౨౪వ తేదిన ఉభయపక్షముల ప్రతినిధులకును తెలిపిరి. తాయిలాండువారు వెంటనే ఆషరతులనంగీకరించిరి. కాని ఫ్రెంచి యిండోచైనావారు వెంటనే అంగీకరించలేదు. ఇండోచైనా ఫ్రెంచిప్రభుత్వమువారి స్థితిని విషీలో ఫ్రెంచిప్రభుత్వమువారు దీనివిషయమై తెల్పవలసియుండెను. ప్రభుత్వమువారు ఈ షరతులను అంగీకరించనిచో జపాను ఇండోచైనాపై కఠినచర్యకుదిగుపక్షంలో బ్రిటను, అమెరికాలు ఫ్రెంచివారికి జపానును ప్రతిఘటించుటకు తోడ్పడగలరని ఫ్రెంచివారు ధీమాతోనున్నారేమో, అదిజపాను గ్రహించియే ఉన్నదని—జపానుపత్రికలు ఫ్రెంచివారిని బెదరించినవి. ఇండోచైనావారు జపానుషరతులకు వెంటనే అంగీకరించుటయే గాక ఇండోచైనాలోని డాంగుకింగురాష్ట్రంలో యువకులందరును సైన్యములో చేరుటకు సిద్ధముగానుండవలెనని ఆరాష్ట్రపుగవర్నరు ఆజ్ఞనొసగెను, ౨౬వ, ౨౮వ తేదులలో ఫ్రెంచి ఇండోచైనా ప్రభుత్వమువారు తమదేశంలోనుండి జపాను కంపెనీలను వెడలగొట్టిరి. ఈవిషయమునుగూర్చి విచారణచేయించెదమని జపానువారనిరి. జపానువారును ఇండోచైనాతిరుగుబాటుచేయుచో అణచుటకై తగినవ్యవహారసన్నాహములను చేసికొనసాగిరి. ఇండోచైనా దగ్గరనుండు హైనాను ద్వీపమునకు జర్మను, ఇటాలీయ సైనికనిపుణులు ౬౦౦ మంది ఇండోచైనాపై దండయాత్రసాగించే విషయంలో జపానుకు సలహానిచ్చుటకై వచ్చి ౨౬వ తేదిన చేరిరి. హైనాను దీవివద్దను, దానిచుట్టుప్రక్కలదీవులవద్దను ౧౦౧ జపానుయుద్ధనౌకలు చేర్చబడెను. ఇటీవలనే హైనాను, ఫార్మోసా దీవులను ౫౦ వేలమంది జపానీయసైనికులు చేర్చబడిరి. హైఫాంగులో ఫిబ్రవరి ౨౫వ, ౨౭ తేదులలో జపానునేవలు చేర్చబడెను. ఇట్లుసన్నాహములు చేసికొనుచు మార్చి ౧వ తేదిలోగా ఫ్రెంచిప్రభుత్వమువారినుండి తమషరతుల సమాధానమును జపానువారు కోరిరి. అప్పటికిని ఆసమాధానము వచ్చేటట్లులేనందువల్ల మరిఒకరోజు గడువు పెంచిరి. అప్పటికి ఫ్రెంచిప్రభుత్వమువారు అనవసరంగా యుద్ధపుభీతియెందుకని తలచి జపానువారి షరతుల ప్రధానాంశములను అంగీకరించినట్లు వార్తవచ్చినది. ఇదియింకనురూఢికాలేదు. మొత్తముమీద జపానువారి హడావుడి చూచ్చి ఫ్రెంచివారిని బెదరగొట్టినట్లుకనపడును— జపానువారు యుద్ధానికి ముందుగాచేయునట్లు ఫ్రెంచివారి ఇండోచైనాలోనుండియు, హైఫాంగులోనుండియు జపానీయులందరును లేచి రావలెనని ఆజ్ఞాపించిరి. సింగపూరులోనుండియూ జపానీయులందరును లేచివచ్చుచున్నారు.

తాయిలాండు దక్షిణభాగంలో జపానువారలు ఎక్కువగానుండుటవల్ల వారల యోగక్షేమాలను విచారించుటకై అభాగలోను సాంద్లాలోను, సింగరాలోను క్రొత్తరాయబారులను ఏర్పాటుచేయుటకు జపానప్రభుత్వం వారు నిశ్చయించిరి.

డచ్ఈస్టిండీస్ వారితో జపానువారు వర్తకం విషయమై సంభాషణలు సాగించుచునేయున్నారు.

తాయిలాండుకు పూర్వము రాజుగానుండిన ప్రజాధిపోగారు ఫిబ్రవరి ౨౬వ తేదిన ఒకపత్రిక విలేఖరితో సంభాషించుచు, తాయిలాండు ఇండోచైనా సరిహద్దులమార్పుటకై కోరినది జపాను ప్రేరణవల్లగాక స్వతంత్రముగానేననియు, ఈవిషయంలో సమాధానం కుదరనిచో తాయిలాండు యిండోచైనాతో మరల యుద్ధం ప్రారంభించగలదనియు, అప్పుడు ఈ ప్రాచ్యఖండ ప్రాంతంలో శాంతిరక్షణమిషతో జపాను ఇండోచైనాను ఆక్రమించుకొనవచ్చుననియు. కానియూరోపులో తనమిత్రుల జయాపజయధోరణులను గమనించిగాని జపానువారు ఇండోచైనామీదికి యుద్ధానికిదిగరనియు, జపాను సింగపూరుపై దాడివెడలుచో, తాయిలాండుగుండా తనసైన్యమును పంపవలెననియు, అందుకై జపానువారు తాయిలాండుకు మిత్రులుగానటించుచున్నను, తాయిలాండువారు మోసపోరనియు, సయాంరాజులు ఎల్లప్పుడును బ్రిటనుకు అనుకూలురుగానుండినవారనియు, ఇపుడు జపానుపక్షంచేరి బ్రిటనును విడనాడుట తాయిలాండుకు నాశకరమనియు చెప్పిరి.

—

### దయానంద అనాథాశ్రమము

నిజామాబాదులోని దయానంద అనాథాశ్రమమునకు బొంబాయిదాతలు ఈక్రిందివిరాళములు యిచ్చిరి:—

కరక రాజయ్య రు ౨౫

మొగలాజి రాజన్న కోయల్ కర్, ౨౫

మహామేరు టైలరింగ్ వర్క్సు తరుపున శ్రీశిరపయ్యగారు వసూలు చేసియిచ్చినది రు ౨౫

బొంబాయిభూలేశ్వర్ ఫూల్‌గల్లిబీడీవర్క్సు పనివాండ్రనుండి రు ౪౭లు

వెల్లప్ప వేంకయ్య ఎక్కలదేవిదాన్ వీక్ ౧౦

ఇతరులు ౫మంది ౫ రూపాయిలు ప్రకారం అంతకుతక్కువమొత్తాలను దయచేసినారు,

ఇట్లు
డి. వి. స్వామి.
ఆర్యప్రచారక్.

ఈనోస్
"ఫ్రూట్ సాల్ట్"
సేవించి
భోజనానంతరము సంభవించే వాయురోగాల
నుండి గుణముపొందుడు.
6 ఔన్సులకు ౧౪ పేక.
ENO'S FRUIT SALT

( తరువాయి భాగము )

ధర్మశాస్త్రములలోను పురాణాలలోను, వేదంలోను సర్వవర్ణములవారును శస్త్రధారులైయుండిరనియు, అందరునుసూరులేయనియు, స్పష్టముగా ఒకటికాదునూరుకాదు వేలనిదర్శనములున్నవి. వర్తమానపత్రికవారు ఏ సంగతిమక్కనో అదియును సరిగా తెలుసుకొనక వినుకొని కలంపట్టి యిప్పుడు వ్రాతలనుగీకినంత నేహిందువులలో క్షత్రియులకు శస్త్రాధికారముపోనేరదు. తెలియనిచో నేర్చుకొనికూర్చొనవలెను. జ్ఞానలవదుర్విదగ్ధతచే అజ్ఞానవిలసనములను ప్రకటించుకొనువారి వ్రాతలను విలువయేమియుయుండదు వర్తమానపత్రికవారికి సంస్కృతములోని ఓనమాలైనను రావని ఈవ్రాతవలన సుస్పష్టమైనది. హిందువులలో అన్నివర్ణములవారును శ్రీ ఎవరు శస్త్రములబట్టుకొనవచ్చును. దసరాపండుగ దీపావళిపండుగలు సర్వవర్ణములక్షాత్రగుణమును పెంపొందించుటకే పూర్వము పెద్దలు ఏర్పాటుచేసినారు. ఈరోజు నేటికిని దసరా పండుగనాలలో ఆయుధపూజలు జరుగును అపరాజితాదేవిపూజలు జరుగును తుదిదినమునాడు ప్రతిగ్రామములోని జనులును ఆయుధపాణులై నేటికిని సీమోల్లంఘనము చేసివచ్చెడివారు దానినేయిప్పుడు 'సిలంగన్' అనియందురు.

కర్ణుడు లెక్కకువచ్చువాడేకదా, శస్త్రములుపట్టకూడదని శాసించిరా? ఏకలవ్యుడు కడజాతివాడు కదా పాండవులనుగూడ శస్త్రవిద్యలో మించిపోలేదా! వానరులు అనుఅడవిజాతివారు శస్త్రములుపట్టి శ్రీరామపక్షమున యుద్ధముచేయలేదా! కృష్ణాసురులతో మల్లయుద్ధాలుచేసిన చాణూరాదిఅంధ్రమల్లులు శూద్రులైయుండిరికదా? శూద్రవేషముతో నుండిన భీముడు గంటలు వండుటయేగాక కత్తులుతిప్పలేదా గదతిప్పలేదా కస్తీలుపట్టలేదా వంటలవారును కస్తీలుపట్టి గామావంటివారై కీర్తినిగడించినప్పుడు అంతకన్నను మేలైనవృత్తులలోనుండినవారినిగురించి యేమిచెప్పవలెను! దుష్యంతునిచుట్టు ధనుస్సులుబట్టిన స్త్రీలుండిరికదా! వారుధనుస్సులను లీలగాపట్టియుండిరా తీక్ష్ణబాణాలు కురిపించుకుంటూవుండిరా? సోహరాబురుస్తుములు అను పారశీకదేశమువారు ౩౦౦౦ ఏండ్లకిందటయుద్ధాలుచేసినప్పుడు హిందూదేశపుకత్తులతో యుద్ధము చేసిరను సంగతి జ్ఞాపకముంచుకొనవలెను. హిందువులలో యుద్ధకళ సర్వసామాన్యంవారిఅసామాన్యమైన కత్తులువిదేశాలకు ఎగుమతియగుచుండెనుకదా? భారతములో శాంతిపర్వములో అనేకాధ్యాయాలలో యుద్ధపద్ధతులుంచినారు. కౌనుందకుడు శుక్ర,బృహస్పతి,చాణక్యుడు వ్రాసిన గ్రంథాలలో యుద్ధచర్యలు, శాస్త్రచర్యలు, అపూర్వముగానున్నవి. ధనుర్వేదము నాలుగుఉపవేదాలలో ప్రథమస్థానమువహించినట్టిది. ప్రపంచమంతయును ధనుర్విద్య మొట్టమొదటకనిపెట్టినవారు హిందూఆర్యులు. ఇంకను ఈ చర్చలో విజ్ఞానముకోరితే మరొకనాడు కూలంకషముగా చర్చించగలను. ఇప్పటికియీవిషయంలో ఏమన్నా తెలియనివర్తమానపత్రికవారున్నా దానివ్రాతలను చదివిజవాబు తెలియనివారికిన్ని యింతమాత్రం చర్చాలనకొందును.

—వెంకటప్ప

—

భాగ్యవంతులు గండు

నిజాంరాష్ట్రమున ప్రకటింపబడు ఏకైక వ్యవసాయసంచిక

హైదరాబాదు ఫార్మర్

ఇంగ్లీషు, తెలుగు, ఉర్దూభాషలలో కలిసి ప్రకటింపబడును

దీనికి చందాదారులై

వ్యవసాయాభివృద్ధికి, పైరులమీకల్లు చీడలు, పురుగులబాధలనుండి రక్షించుకొనుమార్గముల తెలుసుకొనుడు. ఎక్కువధనమును సంపాదించుటకు ఎట్టిశ్వవసాయపద్ధతులు నవలంబించవలెనో, ఎట్టివిత్తనము లుపయోగించవలయునో తెలుసుకొనుడు.

హైదరాబాదు ఫార్మరు

తమకు యీవిషయముల నన్నింటని విశదపరుచగలదు

యీవిషయ పరిజ్ఞానము తమకు ఐశ్వర్యముచేకూర్చును

సంవత్సరముచందా పోలీర్పు 3/- మాత్రమే. వి.పి.చార్జిలువేరు. ఏసోసియేషన్ సభ్యులకు యీ సంచిక ఉచితము. సభ్యత్వచందా సంవత్సరమునకు రు 5/- మాత్రమే.

యీరోజే యీక్రింది విలాసమునకు వ్రాయుడు.

గౌరవకార్యదర్శి,

హైదరాబాదు ఫార్మింగ్ ఏసోసియేషన్

మ.ఘు.వ. నిజాంప్రభుత్వ వ్యవసాయశాఖ, హైదర్‌గూడ, హైదరాబాదు-దక్కన్.

—

ఈశ్వరఫార్మసి పి.127బి. మద్రాసు

| | |
| --- | --- |
| గనోక్యోల్ సీసా ౧కి రు 2-8-0 | మూత్రము మంట, చురుకు, సెగ యెంతకఠినముగానున్నను, పురుషులకైనను, స్త్రీలకైనను తప్పక గుణపరచును. |
| కుముద సీసా౧కి రు 1-14-0 | ఋతుస్రావ ఋతువు సరిగాకాకపోవుట, తెల్లకుసుమ, ఎర్రకుసుమ, మొదలగు స్త్రీలగర్భాశయ వ్యాధులను గుణపరచును. |
| రత్న పురుష లేహ్యం ౧ కి 1—4—0 | స్వప్నస్ఖలనము, స్వప్నస్ఖలనము. నరముల బలహీనత, మలబద్ధకము, తగ్గించి కండపుష్టి బలము, రక్తము, వీర్యమునువృద్ధిచేయును. |

ఏజన్సీ:—3 16 కింగ్స్‌వే, శికిందరాబాదు.

—

ఉబ్బసవ్యాధికి చికిత్సలేదా?

ఉన్నది! సమస్తవిధములగు ఉబ్బసవ్యాధులకు "యేకైకరక్ష" స్టాక్స్ వా ఆస్తమాక్యూర్ యొక్కటే. 40 సం॥లకు పైగా అనులులోనుండి ప్రశంసాపాత్రమగు మానవసేవచేయుచున్న వరప్రసాదిని. మందు ప్రారంభముచేసిన దినముననే ఆయాసము (దమ్ము) నుపూర్తిగా నిల్పివేసి, ఊపిరితిత్తులలో గడ్డకట్టిన శ్లేష్మము కరిగించి పైకిసెడలించి దగ్గునుతగ్గించి, రాత్రులందు సుఖనిద్రగల్గజేయును. ఇందు విషపదార్థములేమియు చేరియుండలేదు.

దొరకు స్థలములు

| | | |
| --- | --- | --- |
| హైదరాబాదు: | కింగ్ అండ్ కంపెనీ, | అప్జల్‌గంజు, |
| సికింద్రాబాదు: | సి. మూల్ చంద్ అండ్ కో, | స్టేషనురోడ్, |
| వరంగల్ : | రవ్వాలింగయ్యగారు, | చౌరస్తా |
| కొత్తగూడెం : | ఫ్రేమ్‌రోజ్ బైరాంజీఅండ్ కో | |
| ఖమ్మంమెట్: | కావేటి బాలయ్యఅండ్ సన్సు | |

తయారుచేయువారు

జి. యస్. స్టీర్సు అండ్ కంపెనీ
మదరాసు.

—

వసంతకుసుమాకరం

మధుమేహము (Diabetes)

అతిమూత్రము. రొచకుపప్పలు. మొదలగు సకలమేహవ్యాధులకు దివ్యౌషధము

తులం. కల్హార. రు 20/

వేంకటేశ్వరఆయుర్వేదనిలయము

చింతలూరు.

బ్రాంచి:—సికింద్రాబాద్. 6 26. కింగ్స్‌వే

—

K· V· Shan..ariah

GENERAL CLOTH MERCHANT

Kingsway — Secunderabad

క్రొత్త ... స్వదేశపు!! చౌకధరలు!!!

భా ... లకై

మావద్ద ... చీరెలు, శింగాయి క్రేపు శిల్కు ... శిల్కు, ... నేతచీరెలు, సినిమా తారలచే ... నవీన ... డిజైనులును మాయాబజారుశిల్కులు ... నవీనసూటింగ్సును ... దొరకును. తమకు ...

మైనాస వెంకన్నగారి శంకరయ్య

బట్టల వర్తకం

కింగ్స్‌వే — శికింద్రాబాదు

